


సేకరణ : అతావుర్రహ్మాన్ జియావుల్లాహ్

# బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం

**అల్‌హమ్దు లిల్లాహి వకఫా వ సలామున్ అలా ఇబాదిహిల్లజీ నస్తఫా అమ్మాబాద్:**

ప్రస్తుత కాలపు బిద్‌అత్ (కొత్తపోకడ)లలో తీవ్రతరమైన బిద్‌అత్ రబీవుల్ అవ్వల్ మాసంలో పన్నెండవ తేదీన దైవప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారి జన్మదిన వేడుకలు జరుపుకోవడం. ఈ వేడుకలు అనేక దేశాల ప్రజలు ఎంతో భక్తిశ్రద్ధలతో జరుపుకుంటున్నారు.

కాని ఈ వేడుకకు షరీఅత్ పరంగాగాని చారిత్రక పరంగాగాని అసలు స్థానం ఉందా? ఈ విపరీత పోకడ ఈ సమాజంలో ఎక్కడి నుంచి వచ్చింది? దీని వెనుక ఉన్న ఉద్దేశమేమిటి? ఈ వాస్తవం చాలా మందికి తెలియదు.

ఆ వాస్తవాలను బట్టబయలు చేసి దీని రూపకర్తల తెరచాటు దురుద్దేశా లను గనక తేటతెల్లం చేస్తే ప్రియప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారి వీరాభి మానులకు విషయం స్పష్టంగా బోధపడుతుంది. ఈ విషయంపై వారు మంచి మనస్సుతో ఆలోచించి పశ్చాత్తాపం చెంది తిరిగి ఋజుమార్గం వైపుకు వచ్చేస్తారు.

మూడు ఉత్తమ తరాలు (ఖైరుల్ ఖురూన్) గడిచినప్పటికీ ఎక్కడా కూడా సహాబా (రజియల్లాహు అన్‌హుమ్) లు గాని, తాబయీన్‌లు గాని, తబేతాబయీన్‌లు గాని వారి తర్వాత వచ్చిన వారిలో ఏ ఒక్కరూ కూడా మీలాదున్నబీ వేడుకలు జరిపినట్లు ఆధారాలు లేవు. నిజానికి దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను అమితంగా ప్రేమించినవారు, అత్యంత ఎక్కువగా సున్నత్ పరిజ్ఞానం కలవారు, షరీఅత్‌కు విధేయులై ఉండటానికి అందరికంటే ఎక్కువగా ఆసక్తి కనబరచిన వారు వీరే కదా!.....

బనూ ఉబైదుల్ ఖద్దాహ్ అనే తెగవారు మొట్టమొదటగా ఈ బిద్‌అత్‌ను ప్రారంభించారు. వీళ్లు తమను తాము ఫాతిమీలుగా చెప్పుకుంటారు. అలీ బిన్ అబీతాలిబ్ (రజియల్లాహు అన్హు) సంతానానికి చెందినవాళ్ళమని ప్రచారం చేసుకుంటారు. నిజానికి వీళ్ళు 'బాతినియ్య' మత స్థాపకులలోని వారు. వీళ్ల పితామహుడు ఇబ్నెదీసాన్. ఇతనికి అల్‌ఖద్దాహ్ అనే బిరుదు వుంది. ఇతను జాఫర్ బిన్ ముహమ్మద్ సాదిఖ్ వద్ద నుండి స్వాతంత్ర్యం పొందిన బానిస.

ఇతను ఇరాక్‌లోని బాతినియ్యా మత స్థాపకుల్లోనివాడు. తర్వాత పశ్చిమం (మురాఖష్) వైపు వెళ్ళాడు. అక్కడ అఖీల్ బిన్ అబూతాలిబ్‌తో తన సంబంధాన్ని కలుపుకున్నాడు. దాంతో తనకు తాను అఖీల్ సంతానంగా భావించుకున్నాడు. కరడుగట్టిన రాఫిజీ మతస్తులు కొంతమంది తన సందేశాన్ని స్వీకరించగానే తాను ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బిన్ జాఫరుల్ సాదిఖ్ సంతానంలోని వాడని బహిరంగంగా ప్రకటించటం మొదలుపెట్టాడు. అతని సందేశాన్ని స్వీకరించినవారు అతను చెబుతున్నది నిజమేనని భావించారు. నిజానికి ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బిన్ జాఫరుల్ సాదిఖ్‌కు సంతానమే లేదు. ఇతని విధేయుల్లో హమ్దాన్ బిన్ ఖుర్‌ముత్ అనేవ్యక్తి ఉండే

వాడు. ఇతనికి ఖురామతా అనే గుర్తింపు ఉండేది. కొంతకాలం తర్వాత ఈ కోవకు చెందినవారి లోనే సయీద్ బిన్ హుసైన్ అహ్మద్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ మైమూన్ బిన్ దీసానుల్ ఖద్దాహ్ అనే వ్యక్తి ప్రత్యక్షమయ్యాడు. అతను తన పేరును, వంశపరంపరను మార్చుకున్నాడు. తన అభిమానుల్లో "నేను ఉబైదుల్లాహ్ బిన్ అల్ హసన్ బిన్ ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బిన్ జాఫరుల్ సాదిఖ్" అని చెప్పుకున్నాడు. ఈ విధంగా పాశ్చాత్తదేశం (మురాకష్)లో అతని మోసం ప్రారంభ మైంది. కాని వంశపరంపరకు చెందిన విజ్ఞాన పరిశోధకులు అతని వంశపరంపర సంబంధాన్ని తోసిపుచ్చారు. అలా హిజ్రి 402వ యేట రబీవుల్ ఆఖిర్ మాసంలో కొందరు ధర్మవేత్తలు, హదీసువేత్తలు, ఖాజీలు, పుణ్యాత్ములు కలిసి ఫాతిమీ ఉబైదీ వర్గం వారి వంశపరంపరలో ఉన్న లోపాలను క్రోడీకరించారు. అందరూ కలిసి ఇలా ప్రకటించారు: 'అల్‌హాకిమ్' బిరుదాంకితుడు ఈజిప్ట్ పాలకుడు మన్సూర్ బిన్ నజ్జార్ బిన్ మఅద్ బిన్ ఇస్మాయిల్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ సయీద్ ప్రాచ్యదేశాలకు (మురాకష్) వెళ్ళినప్పుడు తన పేరును "అబ్దుల్లాహ్"గా తన బిరుదును "మహ్‌దీగా" మార్చుకున్నాడు.

ఇతని పూర్వీకులు ఖారిజీ మతస్తులు. అలీబిన్ అబూతాలిబ్‌తో వీరి వంశ పరంపర కలవదు . అతను ప్రకటించుకున్నదంతా పచ్చి అబద్ధం. అదీగాక మాకు తెలిసినంతమటుకు అలీ బిన్ అబూతాలిబ్ వంశస్తుల్లో ఎవరూ కూడా వాణ్ణి ఖారిజీ మతస్తునిగా లెక్కగట్టకుండా ఉండలేదు. అసలు నిజం ఏమిటంటే ఈజిప్ట్ చక్రవర్తి మరియు వాడి పూర్వీకులందరూ కూడా అవిశ్వాసులు. ఇస్లాం సుగంధం ఇసుమంతైనా సోకని పరమ అవిధేయులు. సత్య తిరస్కారులు. ఇంకా చెప్పాలంటే వారందరూ కూడా మజూసీలు (అగ్నిని పూజించే వాళ్ళు). విగ్రహారాధకులు. వారు ఇస్లాంలో హద్దుల్ని నిర్భయంగా అతిక్రమించారు. వ్యభిచారాన్ని ధర్మసమ్మతంగా భావించేవారు. మద్యపానం పాపం కాదన్నారు. సమాజంలో విపరీతంగా రక్తపాతం సృష్టించారు. దైవప్రవక్తల్ని తూలనాడేవారు. సదాచార సంపన్నులైన పూర్వీకులకు (సలఫ్‌కు) శాపనార్థాలు పెట్టేవారు".

ఈ విషయాలన్నీ ఆనాడు గ్రంథస్తం చేయబడ్డాయి. ఆ కాగితాల మీద హనఫీ, మాలికీ, షాఫయీ, హంబలీ, అహ్లెహదీసు, తర్కశాస్త్ర పండితులు, వంశపరంపర పరిశోధకులు, అలవీ వర్గం వారు, ఇంకా సామాన్యప్రజల సంతకాలు కూడా ఉన్నాయి. వీళ్ళందరూ ఫాతిమీల వంశపరంపరలోని లోపాలను ఎత్తిచూపారు. నిజానికి ఈ ఫాతిమీలు (ఉబైదీలు) అగ్నిపూజారులనీ, యూదుమతస్తులని ఎలుగెత్తి చాటారు. అలా ఎలుగెత్తి చాటిన పండితులయితే దీనికి సంబంధించి ప్రత్యేకంగా పుస్తకాలు కూడా రాశారు. నిజానికి ఈ ఫాతిమీలు ఇస్లాం తిరస్కారులనీ, పైకి మాత్రం వారు రాఫిజీలుగా, షియాలుగా కనిపించేవారని వారు తమ పుస్తకాల్లో పేర్కొన్నారు (ఇబ్నె కసీర్ గారి అల్ బిదాయా వన్ని హాయా గ్రంథం 15/537 నుంచి 540 పేజీలు). ఫాతిమీలు (ఉబైదీలు) హిజ్రీ శకం 362వ యేట రమజాన్ నెల 5వ తేదీన ఈజిప్ట్‌లోకి ప్రవేశించారు. వారి

పాలనాకాలం ఇక్కడి నుంచి ప్రారంభమయింది. ముస్లిం సమాజంలో మొట్టమొదటగా బిద్అత్‌ల ద్వారాన్ని తెరిచినది కూడా వీరే. ఒక్క దైవప్రవక్త పుట్టిన రోజు (మీలాదున్నబీ) మాత్రమే కాదు, మీలాదె అలీ మీలాదె హసన్, మీలాదె హుసైన్, మీలాదె ఫాతిమా మొదలగు పండుగలు, ఇంకా వీటితోపాటు మజూసీల (అగ్నిపూజారుల), క్రైస్తవుల పండుగలు కూడా వీరు రంగవైభవంగా జరుపుకునేవారు. దీని ద్వారా వారు ఇస్లాం ధర్మానికి ఎంత దూరంగా ఉండేవారో, ఇస్లాం ధర్మానికి వారు ఎంతటి విముఖులో అర్థమవు తుంది. అంతేకాదు పైన పేర్కొన్న పండుగలు వారు దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) మీద అభిమానం మూలంగానో లేక అలీ (రజియల్లాహు అన్హు) కుటుంబం మీద ప్రేమ వల్లనో జరుపుకునేవారు కాదు. పైగా ఈ పండుగలను ముస్లిం సమాజంలో ప్రవేశపెట్టి లోపాయికారీగా తమ తప్పుడు విశ్వాసాలను, మూఢ నమ్మకాలను ప్రచారం చేసి ముస్లింలను తమ నిజధర్మం నుంచి, నికార్సయిన విశ్వాసాల నుంచి తప్పించటమే వారి అసలు ఉద్దేశం.

మరి ఫాతిమీలు (ఉబైదీలు) దురుద్దేశ పూరితంగా సృష్టించిన ఈ నీచపు బిద్అత్ పండుగను ఇంగిత జ్ఞానం ఉన్న ఏ ముస్లిం జరుపుకుంటాడు??? అంతేకాకుండా ఆ కాలపు సామాజిక పరిస్థితులపై దృష్టి సారిస్తే ఉబైదీల రాజకీయాలు కేవలం ఒక లక్ష్య సాధన కోసమే కేంద్రీకృతమై ఉండేవని తెలుస్తుంది. అదేమిటంటే పూర్తి చిత్తశుద్ధి పరాయణతలతో తమ మతం స్వీకరించడం కోసం ప్రజలను సన్నద్ధం చేయడం. ఈజిప్ట్‌దేశం చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో దానిని వ్యాపింపజేయడం. దీని కోసం ఉబైదీరాజులు యూదుల, క్రైస్తవుల పట్ల వీలైనంతవరకు సానుభూతి, కనికరం చూపేవారు. వారికి ఉన్నత పదవులు, హోదాలు కట్టబెట్టేవారు. మరోవైపు సున్నీల పట్ల వారి వ్యవహారం అందుకు భిన్నంగా ఉండేది. ముగ్గురు ఖలీఫాలను, ఇతర సహాబాలను మరియు సున్నీలందరిని వారు మింబర్‌లపై నిలుచొని దూషించేవారు. హిజ్రీ 372 వ యేట ఈజిప్ట్ దేశంలో తరావీహ్ నమాజ్‌ను నిషేధించారు. హిజ్రీ 395 వ యేట ఈజిప్ట్‌లోని అన్ని మస్జిదులు, భవనాలు, శ్మశాన వాటికలు మరియు దుకాణాలపై సల్ఫెసాలిహీన్‌లకు వ్యతిరేకంగా దూషణా వచనాలు రాశారు. వాటిని రంగు రంగులతో తీర్చిదిద్దారు. వీటన్నిటినీ మించి ఉబైదీ పాలకుడు (మన్సూర్ బిన్ నజ్జార్) తానే దేవుడినని ప్రకటించుకున్నాడు. ఖతీబ్ (ఉపన్యాసకుడు) మింబర్ (వేదిక)పై తనపేరు ప్రస్తావిస్తే గౌరవార్థం వెంటనే లేచి నుంచోవాల్సిందిగా ఆదేశాలు జారీ చేశాడు. అతని రాజ్యం నడిచే దేశాలన్నిటిలో ప్రజలు అలానే చేసేవారు. చివరకు మక్కా మదీనాలలో కూడా, ముఖ్యంగా ఈజిప్ట్‌వారికి తన పేరు ప్రస్తావనకు వచ్చిన వెంటనే సాష్టాంగ పడవలసిందిగా ఆదేశాలిచ్చాడు. పౌరుషం గల ఒక ముస్లిం వ్యక్తి ఇస్లాం శత్రువులు రూపొందించిన ఇలాంటి దుష్ట పోకడలను అవలంబించడాన్ని దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారిపై ప్రేమగా నమ్ముతాడా?!!!

**ఇస్లాం సోదరులారా!**

ఇదీ “మీలాద్” చరిత్ర. దురదృష్టకరమైన విషయమేమిటంటే చాలామంది ముస్లింలు దీనిని ఎంతో ఉత్సాహంతో జరుపుకుంటున్నారు. వాస్తవానికి దీని చాటున ఉబైదీయులు రహస్యంగా తమ మతాన్ని వ్యాపింపజేసి సున్నత్‌ను నాశనం చేశారు. అందుకే ఈ కొత్త పోకడ రూపొందిన నాటినుండే మన పండితులు దానిని వ్యతిరేకిస్తూ వచ్చారు. దానికి వ్యతిరేకంగా చాలా పుస్తకాలు రాశారు. ఎవరైతే ఈ వేడుక జరుపుకోవడాన్ని ధర్మసమ్మతమని నిరూపించడానికి ప్రయత్నించారో వారి గురించి “పాపం చేస్తూ, దానికి సాకులు చూపటం ఇంకా పెద్ద పాపం” అని అభివర్ణించారు. ఖైరుల్ ఖురూన్‌లో (ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నుంచి తాబయీన్ల కాలం వరకు) దీని ఆధారాలు లేవు. కాబట్టి దీనిని నిర్మోహమాటంగా తిరస్కరించ వచ్చు. మన పూర్వీకులకు ధర్మం కాని విషయం నేడు మనకు కూడా ధర్మం కాజాలదు. అది పుణ్యప్రదమైన కార్యమే అయితే మన కంటే ముందు వారే దానిని అవలంబించే వారు. అయినప్ప టికీ ఈ విషయానికి సంబంధించి ప్రఖ్యాత ఉలమాల రెండు ఫత్వాలను మీ ముందుంచుతున్నాము.

**అష్షైఖ్ అబ్దుల్ అజీజ్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ బాజ్ (రహ్మాలై) దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుకల అదేశం మీలాదున్నబీ నాడు జరిగే కార్యాల గురించి ఆయన ఇలా పేర్కొన్నారు:**

దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారి జన్మదిన వేడుకలు జరుపు కోవడం ధర్మసమ్మ తం కాదు. వేరేవారి జన్మదిన వేడుకలూ జరుపగూడదు. ఎందుకంటే ఇవి ధర్మంలో నూతనంగా రూపొందించబడ్డ కొత్త పోకడలు. వీటిని ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) గాని, ఖలీఫాలు, సహాబాలు గాని వారిని అనుసరించే వారు గాని ఎవరూ జరుపలేదు. అత్యధిక ధర్మజ్ఞానం కలవారు. దైవప్రవక్త ప్రేమికులు, షరీఅత్ అవలంబీకులు వీరేనని నిరూపించబడింది. ఆయన (స ల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రభోదించారు: **“మన్ అహ్‌దస ఫీ అమ్‌రినా హాజా మాలైస మి న్‌హు ఫహువ రద్దున్”**

**అర్థం:–** “మా ధర్మంలో లేని విషయాన్ని రూపొందించినవాడు ధూర్తుడు”.

మరో హదీసులో ఇలా ఉంది:

**“అలైకుమ్ బిసున్నతీ వసున్నతిల్ ఖులఫాయి ర్రాషిదీనల్ మహ్‌దియ్యీన్ మింబాదీ తమస్సకూ బిహా వ అజ్జూ అలైహా బిన్నవాజిజి, వ ఇయ్యాకుమ్ వ ముహ్‌దసాతిల్ ఉమూరి, ఫ ఇన్నకుల్ల ముహ్‌దసతిన్ బిద్అతున్, వకుల్ల బిద్ అతిన్ జలాలహ్”**

**అర్థం:–** మీరు నా తర్వాత నా సున్నత్‌ను, మార్గదర్శకులైన ఖులఫాయె రాషిదీన్‌ల సున్నత్‌ను తప్పనిసరిగా పట్టుకోండి. దానిని స్థిరంగా పట్టుకోండి. పళ్ళతో బిగించి మరీ

పట్టుకోండి. నూతన విషయానికి దూరంగా ఉండండి. ఎందుకంటే ప్రతి నూతన విషయం బిద్అత్. ప్రతి బిద్అత్ మార్గభ్రష్టతే.

పైన పేర్కొనబడిన రెండు హదీసులలోనూ కొత్తపోకడ(బిద్అత్)ను సృష్టించడాన్ని దానిని అవలంబించడాన్ని తీవ్రంగా ఖండించడం జరిగింది. అంతేకాకుండా అల్లాహ్ తన అంతిమ గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు:

**"వమా ఆతాకుముర్రసూలు ఫ ఖుజూహు వమా నహాకుమ్ అన్హు ఫన్తహూ వత్తఖుల్లాహ ఇన్నల్లాహ షదీదుల్ ఇఖాబ్"** *(సూరయె హష్ర్:7)*

**అర్థం:-** దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) మీకిచ్చిన దానిని పుచ్చు కోండి. ఆయన వారించిన వాటికి దూరంగా ఉండండి. మరియు అల్లాహ్‌కు భయపడండి. నిశ్చయంగా అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడు.

మరోచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

**ఫల్ యహ్‌జరిల్లజీన ముఖాలిఫూన అన్ అమ్‌రిహీ అన్ తుసీబహుమ్ ఫిత్‌నతున్ అవ్ ముసీబహుమ్ అజాబున్ అలీమ్.** *(సూరె నూర్:63)*

**అర్థం:-** "దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆదేశాలను వ్యతిరేకించే వారు వారిపై ఏదైనా ముప్పు లేదా దైవశిక్ష వచ్చిపడుతుందేమోనని భయపడుతూ ఉండాలి. ఇంకా ఇలా సెలవిచ్చాడు:

**"లఖద్ కాన లకుమ్ ఫీ రసూలిల్లాహి ఉస్వతున్ హసనతున్ లిమన్ కాన యర్జుల్లాహ వ ల్ యౌమల్ ఆఖిర"** *(సూరె అహ్‌జాబ్-21)*

**అర్థం:-** అల్లాహ్‌పై, అంతిమ దినంపై ఆశలు పెట్టుకుని అత్యధికంగా అల్లాహ్‌ను స్మరించే ప్రతి వ్యక్తికి అల్లాహ్ ప్రవక్తలో మంచి ఆదర్శం ఉంది.

ఆయన ఇంకా ఇలా సెలవిచ్చాడు:

**"వస్సాబిఖూనల్ అవ్వలూన మినల్ ముహాజిరీన వల్ అన్సారి వల్లజీనత్తబ వూహుమ్ బి ఇహ్సానిన్ రజియల్లాహు అన్హుమ్ వరజూ అన్హు వ అ అద్ద లహుమ్ జన్నాతిన్ తజ్రీ తహ్తహల్ అన్హారు ఖాలిదీన ఫీహా అబదన్ జాలికల్ ఫౌజుల్ అజీమ్."**

*(సూరె తౌబా-100)*

**అర్థం:-** అందరికంటే ముందు విశ్వాస సందేశాన్ని స్వీకరించటానికి ముందంజ వేసిన ముహాజిరుల (వలసవచ్చిన వారి) పట్ల, అన్సారుల (ఆశ్రయమిచ్చిన వారి) పట్ల, తరువాత నిజాయితీతో వారి వెనుక వచ్చిన వారి పట్ల అల్లాహ్ తృప్తి చెందాడు. వారు కూడా అల్లాహ్ పట్ల తృప్తి

చెందారు. అల్లాహ్ వారి కొరకు క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యానవనాలను సిద్ధపరచి ఉంచాడు. వారు వాటిలో సదా ఉంటారు. ఇదే మహత్తరమైన సాఫల్యం.

ఇంకా ఇలా సెలవిచ్చాడు:

**"అల్‌యౌమ అక్‌మల్‌తు లకుమ్ దీనకుమ్ వ అత్‌మమ్‌తు అలైకుమ్ నీమతీ వరజీతు లకు ముల్ ఇస్లామ దీనా–"** *(సూరె మాయిదహ్–3)*

**అర్థం:–** ఈనాడు నేను మీ ధర్మాన్ని మీ కొరకు పరిపూర్ణం చేశాను. నా అనుగ్రహాన్ని పూర్తి చేశాను. మీ కొరకు ఇస్లాంను మీ ధర్మంగా అంగీకరించాను. ఇలాంటి సూక్తులు చాలానే ఉన్నాయి .

ఈ విధంగా జన్మదిన వేడుకలు జరుపుకోవడం వల్ల అల్లాహ్ ఈ సమాజం కోసం ధర్మాన్ని పూరిపూర్ణం చేయలేదనే భావం వస్తుంది. దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) వీటి గురించి ప్రచారం చేయలేదు. కాబట్టి ఆయన అనుచర సమాజం (ఉమ్మత్) ఇలాంటి వాటిని ఆచరించడం భావ్యం కాదు. అల్లాహ్ సాన్నిధ్యం పొందే ఆలోచనతో అల్లాహ్ షరీఅత్‌లో ఆయన ఆదేశించని విషయాలను సృష్టించటం చాలా అపాయకర విషయం. ఇది అల్లాహ్ మరియు ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం)కు అభ్యంతరం చెప్పటంతో సమానం. వాస్తవానికి అల్లాహ్ తన దాసులకోసం ధర్మాన్ని పరిపూర్ణం చేశాడు. వారిపై తన అనుగ్రహాలను సంపూర్ణంగా అవతరింప జేశాడు.

దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) చాలా స్పష్టంగా ఇస్లాం ఆదేశాలను ప్రచారం చేశారు. స్వర్గానికి చేర్చే, నరకానికి దూరంగా ఉంచే ఏ మార్గాన్నీ ఆయన తన సమాజానికి వివరించకుండా వదిలిపెట్టలేదు. ఈ విషయం సహీహ్ హదీసులో అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) ద్వారా నిరూపించ బడింది. దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రభోదించారు:

**మా బఅసల్లాహు మిన్ నబియ్యిన్ ఇల్లా కాన హఖ్ఖన్ అలైహి అన్ యదుల్ల ఉమ్మతహూ అలాఖైరిన్ యాలముహు లహుమ్ వయున్‌జిరహుమ్ మిన్‌షర్రిన్ యాలముహు లహుమ్.**

అల్లాహ్ పంపిన ప్రవక్తలందరూ తమ సమాజాలకు మేలైందని భావించిన వాటి వైపు మార్గదర్శకత్వం వహిస్తూ, ఇంకా తమ సమాజాలకు కీడైందిగా భావించిన చెడులను గురించి వారిని హెచ్చరిస్తూ ఉండటం తప్పనిసరి. *(సహీహ్ ముస్లిం)*

మనప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవక్తలందరిలో కెల్లా ఉత్తములు. ఆయన అంతిమ ప్రవక్త అని అందరికీ తెలుసు. ప్రచారం, బోధన మరియు మంచి తనంలో ఆయన వారందరికంటే పరిపూర్ణులు. జన్మదిన వేడుక జరుపుకోవడం ఈ ధర్మంలో ఉండి, దానిని అల్లాహ్ ఇష్టపడేవాడే అయితే దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) తన సమాజానికి తప్పనిసరిగా ఆ విషయాన్ని తెలియజేసేవారు. దానిని తన జీవితంలో తప్పకుండా జరిపి ఉండేవారు. లేదా కనీసం ఆయన సహచరులైనా ఆ వేడుకలను జరుపుకునే వారు. కాబట్టి ప్రముఖులైన వీరే జరపలేదంటే ఇస్లాంలో దానికి ఎలాంటి స్థానం లేదని ఇట్టే అర్థమవుతుంది. అంతేకాదు ఈ కొత్త పోకడ

ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) తన సమాజాన్ని అప్రమత్తంగా ఉండమని చెప్పిన బిద్అత్ ల లోనిది. ఈ విషయం పైన పేర్కొన్న రెండు హదీసులలోనూ వివరించబడింది.

అవే అర్థాలలో ఇతర హదీసులూ ఉన్నాయి. ఉదాహరణకు జుముఅ ప్రసంగంలో ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఉద్బోధించారు:

**అమ్మాబాద్! ఫ ఇన్న ఖైరల్ హదీసి కితాబుల్లాహి, వఖైరల్ హద్యి హద్యు ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లం వ షర్రల్ ఉమూరి ముహ్దసాతుహా, వ కుల్ల బిద్అతిన్ జలాలహ్** *(సహీహ్ ముస్లిం)*

అమ్మాబాద్, అత్యుత్తమ వచనం అల్లాహ్ గ్రంథం. దైవప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారిది అత్యుత్తమ మార్గం. కొత్తగా రూపొందించిన పోకడలు నికృష్టమైనవి. ప్రతి కొత్త పోకడ మార్గ భ్రష్టతే.

ఈ అధ్యాయానికి సంబంధించి ఖుర్ఆన్ వాక్యాలు, హదీసులు చాలానే ఉన్నాయి. పై ఋజువులను ఆచరిస్తూ ఉలమాల ఒక పెద్దసమూహం మీలాద్ వేడుకలను చాలా స్పష్టంగా తిరస్కరించింది. అయితే తర్వాతి తరాలవారు వారిని వ్యతిరేకిస్తూ మీలాద్ వేడుకలను ధర్మసమ్మతంగా ఖరారు చేశారు. వారించబడ్డ (ముంకర్) కార్యాలకు దూరంగా ఉంటూ వేడుకలు జరుపుకోవచ్చన అన్నారు. ఉదాహరణకు ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను కీర్తించడంలో అతిశయించడం, స్త్రీ పురుషులు కలివిడి తనం, సంగీత వాయిద్యాల వినియోగం, ఇంకా ధర్మం అనుమతించని ఇతర కార్యాలకు దూరంగా ఉంటూ మీలాద్ జరుపుకోవచ్చని వారు అభిప్రాయపడ్డారు. దీన్ని వారు బిద్అతె హసనాగా పేర్కొన్నారు.

ప్రజల మధ్య వివాదంగా మారిన విషయాన్ని అల్లాహ్ గ్రంథం మరియు దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) హదీసులతో సరిచూడాలి. మరి ఈ సందర్భంగా అల్లాహ్ ఏం సెలవిస్తున్నాడో చూడండి!

**యా అయ్యుహల్లజీన ఆమనూ అతీఉల్లాహ వ అతీ వుర్రసూల వ ఉలిల్ అమ్రి మిన్కుమ్ ఫ ఇన్ తనాజాతుమ్ ఫీ షైయిన్ ఫరుద్దూహు ఇలల్లాహి వర్రసూలి ఇన్ కున్ తుమ్ తూమిన నాన బిల్లాహి వల్ యౌమిల్ ఆఖిరి జాలిక ఖైరున్ వ అహ్సను తావీలా-** *(సూరె నిసా-59)*

**అర్థం:-** విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్కు, ప్రవక్తకు, మీలో అధికారం అప్పగించబడిన పెద్దలకు విధేయత చూపండి. మీ మధ్య ఏదైనా వివాదం తలెత్తితే దాన్ని అల్లాహ్ వైపుకు, ఆయన ప్రవక్త వైపుకు మళ్ళించండి, మీరు అల్లాహ్ మీద, అంతిమ దినం మీదా విశ్వాసం కలవారే అయితే. ఇదే సరైన పద్ధతి. ఫలితాన్ని బట్టి ఇదే ఉత్తమమైనది.

అల్లాహ్ మరో చోట ఇలా సెలవిచ్చాడు:

**"వమఖ్తలఫ్ తుమ్ ఫీహి మిన్ షైఇన్ ఫ హుక్ముహూ ఇలల్లాహ్".**

***(సూరె షూరా-10)***

**అర్థం:-** మీ మధ్య ఏ విషయంలో అభిప్రాయ భేదం తలెత్తినా, దానిని గురించి తీర్పు చెప్ప టం అల్లాహ్ పని. మనం ఈ సమస్యను గనుక అంటే దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుకను అల్లాహ్ గ్రంథంతో సరి చూస్తే మనకు కొన్ని విషయాలు బోధపడతాయి. అవే మిటంటే దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆదేశించిన విషయాలను ఆచరిస్తూ వారించి న విషయాలకు దూరంగా ఉండాలి. అల్లాహ్ ఈ సమాజం కోసం తన ధర్మాన్ని పరిపూర్ణం చేశా డు. ఈ జన్మదిన వేడుకలూ ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం) గారు తీసుకువచ్చిన ధర్మంలో లేదు. ఈ ఆచారం అల్లాహ్ మన కోసం పరిపూర్ణం చేసిన ధర్మ విషయాలలోనిదీ కావు. ఇందు లో మనకు దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) కు విధేయులై ఉండాలని ఆదేశించడం జరి గింది. అలాగే మనం ఈ సమస్యను దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) సున్నత్‌తో సరిచూస్తే అక్కడ కూడా మనకు ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుకలు జరుపుకున్నట్లు ఆధారాలు లభించవు. అసలు దీని గురించి ఆయన ఆదేశించినట్లు గాని, కనీసం సహాబా(రజియల్లాహు అన్‌హుమ్)లు దీనిని జరుపుకున్నట్టుగానీ ఋజువులు దొరకవు. కాబట్టి ఇది ధర్మానికి సంబంధించిన విషయం కాదన్న సంగతి దీని ద్వారా మనకు తెలుస్తుంది. నిజానికి ఇది కొత్తగా సృష్టించబడిన ఒక బిద్‌అత్. ఇది యూదుల, క్రైస్తవుల వేడుకలను పోలి ఉంది. కాబట్టి జ్ఞానమున్న నిజాయితీ పరుడైన, సత్య సంధుడైన ప్రతి వ్యక్తికీ మీలాద్ వేడుకలు జరుపుకోవడం ఇస్లాం ధర్మంలోని అంశం కాదని పగటి వెలుగులా స్పష్టమవుతోంది. ఇదొక కొత్త పోకడ(బిద్‌అత్ ). అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త(సల్లల్లాహు అలైహి వ సల్లం) బిద్‌అత్‌లను విడనాడాల్సిందిగా, వాటికి దూరంగా ఉండాల్సిందిగా ఆదేశించారు. సంబరాలు జరుపుకుంటున్న ఈ ప్రపంచాన్ని చూసి విజ్ఞులు మోసపోకూడదు. ఒక అసత్య పనిని చాలామంది కలిసి చేసినంత మాత్రాన అది సత్యం అయిపోదు. షరీఅత్ ఋజువుల ద్వారానే సత్యం నిరూపితమవుతుంది. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ యూదులను, క్రైస్తవులను ఉద్దేశించి ఇలా సెలవిచ్చాడు:

**వఖాలూ లన్ యద్‌ఖులల్ జన్నత ఇల్లా మన్ కాన హూదన్ అవ్ నసారా తిల్‌క అమానియు హుమ్ ఖుల్ హాతూ బుర్‌హానకుమ్ ఇన్ కున్‌తుమ్ సాదిఖీన్-**

*(సూరె బఖరహ్-111)*

**అర్థం:-** యూదులు, క్రైస్తవులు తాము తప్ప మరెవ్వరూ స్వర్గంలో ప్రవేశించలేరు అని ప్రక టిస్తారు. ఇవి వారి కాంక్షలు మాత్రమే. వారిని ఇలా అడుగు: "మీరు చెప్పేది సత్యమే అయితే దా నికి నిదర్శనాలేమిటో చూపండి"

మరోచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

**"వ ఇన్ తుతీ అక్‌సర మన్ ఫిల్ అర్‌జి యుజిల్లూక అన్ సబీలిల్లాహి".**

*(సూరెఅన్‌ఆమ్-116)*

**అర్థం:-** ప్రవక్తా! పుడిమిపై నివసించే ప్రజలలో అధిక సంఖ్యాకులు చెప్పినట్లుగా నీవు

నడిస్తే వారు నిన్ను అల్లాహ్ మార్గం నుండి తొలగిస్తారు.

ఈ మీలాద్ వేడుక ఒక బిద్అత్ మాత్రమే కాదు. ఇది అనేక చెడుగులకు కూడా ఆలవాల మవుతుంది. ఉదాహరణకు స్త్రీ పురుష కలివిడి వాతావరణం, సంగీత వాయిద్యాల వినియోగం, మత్తు పానీయాల వినియోగం ఇవే కాకుండా ఇతర చెడులు కూడా జరుగుతాయి. ఒక్కోసారి వీటి కంటే పెద్ద తప్పిదం అయిన షిర్క్‌కు కూడా జనం పాల్పడుతుంటారు. అదెలాగంటే ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) మరియు ఔలియాలను అతిశయించి కీర్తించడం, వారిని అర్థించడం, వారికి విన్నపాలు చేసుకోవటం, వారిని సహాయం చేయమని వేడుకోవడం, ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) కు అగోచర విషయాలు తెలుసని నమ్మడం, ఇవే కాకుండా ఇతర తిరస్కార కార్యాలు దైవప్రవక్త(సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన సందర్భంగా ఔలియాల "ఉర్స్" సందర్భంగా ఆచరించే ప్రత్యేక కార్యాలు తలపెట్టడం లాంటివి చేస్తుంటారు. దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు:

**ఇయ్యాకుమ్ వల్ గులువ్వ ఫిద్దీని, ఫ ఇన్నమా అహ్లక మన్ కాన ఖబ్లకుముల్ గులువ్వ ఫిద్దీని.**

**అర్థం:–** మీరు ధర్మంలో అతిశయిల్లడానికి దూరంగా ఉండండి. ఎందుకంటే మీకు పూర్వం వారు కూడా ధర్మంలో అతిశయిల్లడం వల్లనే నాశనం చేయబడ్డారు. మరోచోట దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఉపదేశించారు:

**లాతత్‌రూనీ కమా అత్‌రతిన్నసారా ఇబ్న మర్యమ ఇన్నమా అన అబ్దున్ ఫఖూలూ అబ్దుల్లాహి వరసూలుహ్.**

"క్రైస్తవులు ఈసా బిన్ మర్యమ్‌ను హద్దుమీరి కీర్తించినట్లు మీరు నన్ను కీర్తించకండి. నేను అల్లాహ్ దాసుడిని. కాబట్టి మీరు నన్ను అల్లాహ్ దాసుడు మరియు అల్లాహ్ ప్రవక్త అని మాత్రమే అనండి". *(బుఖారి ముస్లిం)*

ఆశ్చర్యకర విషయం ఏమిటంటే ప్రజలు ధర్మంలో లేని కొత్త పోకడలను అయితే ఎంతో ఉత్సాహంగా చేస్తారు. కాని అల్లాహ్ వారిపై విధించిన జుమా మరియు ఫర్జ్ నమాజ్‌లకు మాత్రం ఆమడ దూరంలో ఉంటారు. అసలు ఫర్జ్‌ల వైపు కన్నెత్తి కూడా చూడరు. తాము పాల్పడుతున్న ఈ వైఖరి ఘోర అపరాధం అన్న ఆలోచన కూడా వారికి రాదు. వాస్తవానికి ఈ వైఖరి ఈమాన్ బలహీనతకు తార్కాణం. రకరకాల పాపాలు, చెడులు చేయడం వల్ల వారి హృదయాలకు తుప్పు పట్టింది. ఆ తుప్పు వల్ల వారలా ప్రవర్తిస్తున్నారు. అల్లాహ్ మమ్మల్ని, ముస్లింలందరిని కూడా ఈ జాఢ్యం నుంచి కాపాడుగాక! ఈ చెడు మూలంగానే కొందరు మీలాద్‌వేడుకల సందర్భంగా దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) హాజరవుతారని భావిస్తారు. దానికోసం వారు ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను ఆహ్వానిస్తూ లేచి నించుంటారు. ఇది మూర్ఖత్వం, అజ్ఞానం తప్ప మరేమి కాదు. ఎందుకంటే వారు ఉహించుకున్నట్లు ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం)

ప్రళయం వరకు తన సమాధి నుండి లేపబడరు. ఎవరిని కలవరు. వారు జరుపుకుంటున్న సభలకు హాజరవ్వరు. అయన(సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రళయం వరకు తన సమాధిలోనే ఉంటారు. అల్లాహ్ సూరతుల్ మూమినూన్‌లో పేర్కొన్నట్లు ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆత్మ అల్లాహ్ వద్ద 'ఆలా ఇల్లియ్యీన్'లో ఉంటుంది.

అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు:

**సుమ్మ ఇన్నకుమ్ బాద జాలిక లమయ్యితూన్ సుమ్మ ఇన్నకుమ్ యౌమల్ ఖియామతి తుబ్ అసూన్.**

ఆ తర్వాత నిశ్చయంగా మీరందరూ మరణిస్తారు. మళ్ళీ ప్రళయదినం రోజున లేపబడతారు

.

దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు:

**అన అవ్వలు మన్ యన్‌షఖు అన్‌హుల్ ఖబ్‌రు యౌమల్ ఖియామతి వ అన అవ్వలు షాఫియిన్ వ అవ్వలు ముషఫ్ఫయిన్.**

**అర్థం:-** ప్రళయదినం నాడు అందరికంటే ముందు నా సమాధి చీలుతుంది. ఇంకా నేనే మొదట సిఫారసు చేస్తాను. నేను చేసిన సిఫారసే మొదట స్వీకరించ బడుతుంది.

కాబట్టి ఈ సూక్తి మరియు హదీసు ఇంకా ఇలాంటి భావం కలిగిన ఇతర హదీసులు, ఖుర్ ఆన్ సూక్తులు చెప్పేదేమిటంటే దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) గాని ఇతర ప్రజలుగాని ప్రళయదినం నాడే సమాధుల నుండి లేపబడతారు. ఈ విషయమై ముస్లిం పండితులందరి మధ్య ఏకాభిప్రాయం ఉంది. కాబట్టి ప్రతి ముస్లిం ఇలాంటి విషయాలను తెలుసుకుని అజ్ఞానులు కల్పించిన వినూత్న పోకడలకు (బిద్‌అత్‌లకు)దూరంగా ఉండాలి. బిద్‌అత్‌లకు సంబంధించి అల్లాహ్ ఎలాంటి ఆధారాలూ అవతరింపజేయలేదు. సహాయం కోసం అల్లాహ్‌నే వేడుకోవాలి. నమ్మకం కూడా ఆయనపైనే ఉండాలి. వలా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్.............

**ఒకసారి ఫజీలతు షేఖ్ ముహమ్మద్ బిన్ సాలెహ్ ఉసైమీన్ (రహ్మలై)గారిని "దైవ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుక జరపవచ్చా?" అని ప్రశ్నించటం జరిగింది. అందుకాయన ఇలా సమాధానమిచ్చారు.**

**మొదటిది:-** ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఏ రోజు జన్మించారో సరిగ్గా ఎవరికీ తెలియదు. ఆధునిక విద్యావేత్తల పరిశోధన ప్రకారం అది రబీవుల్ అవ్వల్ తొమ్మిదో తేది అని తెలుస్తుంది. కనుక రబీవుల్ అవ్వల్ పన్నెండో తేదిన ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుకలు జరిగినట్టు చరిత్రలో దాఖలాలే లేవు.

**రెండో విషయం:-** షరీఅత్ పరంగా కూడా మీలాద్ వేడుకలకు ఆధారాలు లేవు. ఒకవేళ మీలాద్ వేడుక అనేది షరీఅత్‌లో ఉండి ఉంటే ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) తప్పకుండా దానిని జరుపుకునేవారు. లేదా కనీసం తన సమాజానికి సందేశం అయినా ఇచ్చి వెళ్ళేవారు.

ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆ వేడుకలు జరిపి ఉంటే లేదా దాన్ని ప్రచారం చేసి ఉంటే నాటి నుంచి నేటి వరకు అవి ఎడతెగకుండా జరపబడుతూ ఉండేవి.

ఎందుకంటే దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

**ఇన్నా నహ్‌ను నజ్జల్‌నజ్జిక్‌ర వ ఇన్నా లహూ లహాఫిజూన్** *(సూరె హిజ్ర్-9)*

"మేమే ఈ దివ్య ఖుర్ఆన్ గ్రంథాన్ని అవతరింపజేశాము. మేమే దాని సంరక్షకులము"

ఈ వేడుకలకు ఎలాంటి ఆధారాలూ లేవు. కాబట్టి ఇవి ధర్మంలోని విష యాలు కావు. ధర్మంలో లేని విషయాలను ఆచరించరాదు. వాటి ద్వారా దైవసాన్నిధ్యం పొందడమనేది అసంభవం. అల్లాహ్ తన వరకు చేరడానికి ఒక నిర్ణీత మార్గాన్ని నిర్దేశించాడు. అదే దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) తెచ్చిన మార్గం. అల్లాహ్ దాసులము, ఆయన బానిసలమైన మనం ఆయన వరకు చేరడానికి స్వంతంగా మార్గాన్ని ఎలా రూపొందించుకోగలం? ధర్మంలో లేని విష యాన్ని మనం మన కోసం ధర్మసమ్మతం చేసుకోవడం అల్లాహ్ సన్నిధిలో నేరంగా పరిగణించ బడుతుంది. అలా చేస్తే అల్లాహ్ ఆదేశాన్ని ధిక్కరించినట్లవుతుంది.

**అల్‌యౌమ అక్‌మల్‌తు లకుమ్ దీనకుమ్ వ అత్‌మమ్‌తు అలైకుమ్ నీమతీ**

**భావం:-** "ఈ రోజు నేను మీ కోసం మీ ధర్మాన్ని పరిపూర్ణం చేశాను మరియు మీ పైనా అనుగ్రహాలను పరిపూర్ణం చేశాను".

మేము చెప్పేదేమంటే ఒకవేళ మీలాద్ వేడుక ధర్మంలో ఉండి ఉంటే అది ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం) మరణానికి ముందు నుంచే ఉండేది. అలాగే అది ధర్మంలో లేనప్పుడు బలవంతాన దానిని ధర్మంలో చేర్చడం కూడా సముచితం కాదు. ఎందుకంటే అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

**"అలయౌమ అక్‌మల్‌తు లకుమ్ దీనకుమ్"**

"ఈ రోజు నేను మీ కొరకు మీ ధర్మాన్ని పరిపూర్ణం చేశాను".

మీలాద్ వేడుకలు దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) మరణించిన చాలా కాలం తర్వాత ఉనికిలోకి వచ్చినవి అన్నమాట అక్షర సత్యం. కనుక ఈ సంగతి తెలిసి కూడా ఎవరైనా ఈ వేడుకల్ని ధర్మంలో అంతర్భాగంగా భావిస్తున్నట్లు యితే అతని ఈ ఆలోచనా తీరు పైన పేర్కొన బడిన ఖుర్ఆన్ వాక్యానికి విరుద్ధంగా పోతుందన్న కఠోర సత్యాన్ని కూడా అతను గ్రహించాలి. ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) జన్మదిన వేడుకలు జరుపుకునే వారి ఉద్దేశం ఆయన (సల్లల్లా హు అలైహి వ సల్లం) ను గౌరవించడం, ఆయన పట్ల తమకున్న ప్రేమను వ్యక్తపరచడం, ఈ వేడుక ద్వారా ప్రజలలో ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) పట్ల ప్రేమాభిమానాలను పురిగొల్పడమే అని అనడంలో సందేహం లేదు. ముమ్మాటికీ ఈ విషయాలన్ని ఆరాధన క్రిందికే వస్తాయి. దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను ప్రేమించడమూ ఆరాధనే. ఆయన (సల్లల్లా హు అలైహి వ సల్లం) ను తమ ప్రాణం కన్నా, తమ సంతానం కన్నా, తల్లిదండ్రుల కన్నా ప్రజలం

దరి కన్నా, ఎక్కువగా ప్రేమించాలి. అప్పుడే ఈమాన్ పరిపూర్ణం అవుతుంది. ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను గౌరవించడమూ ఆరాధనే. అదేవిధంగా ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం ) వ్యక్తిత్వం పట్ల ప్రజలను చైతన్యవంతుల్ని చేయడమూ ఆరాధనే. ఆయన వ్యక్తిత్వం గురించి తెలిస్తే సహజంగానే ప్రజలు అల్లాహ్ ధర్మంవైపు శ్రద్ధ చూపుతారు.

కాబట్టి అల్లాహ్ సాన్నిధ్యం పొందడం కోసం, ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను గౌరవించటం కోసం జన్మదిన వేడుకలు జరుపుకోవడం ఆరాధన అవుతుంది. అయితే అంతే వాస్తవమైన మరొక విషయం ఏమిటంటే  అల్లాహ్ ధర్మంలో లేని విషయాన్ని అందులోకి చొప్పించటానికి ప్రయత్నించటం కూడాఎన్నటికీ ధర్మసమ్మతం కాదు. కాబట్టి మిలాద్ వేడుకలు జరుపుకోవడం పచ్చి బిద్అత్. ఇదొక హరామ్ (నిషిద్ధం) ఆచారం. అంతేకాకుండా సాధారణంగా ఈ వేడుకల్లో జనం షరీఅత్ అనుమతించని విషయాలకూ పాల్పడుతుంటారని వినవస్తోంది. అటువంటి నీతి బాహ్య పనులను షరీఅత్ మాత్రమే కాదు. బుద్ధిజ్ఞానమున్న ఏ మనిషీ వాటికి అనుకూలంగా మాట్లాడలేడు. ప్రజలు హద్దులు మీరి దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) కీర్తనలు పాడుతుంటారు. చివరకు ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను అల్లాహ్ కంటే గొప్పవానిగా చిత్రీకరిస్తారు (నవూజు బిల్లాహ్).

చెడులలోనే మరో విషయం ఏమిటంటే సాధారణంగా వేడుక జరుపుకునే వారిలో కొందరు అవివేకుల, అజ్ఞానుల గురించి మనం వింటూ ఉంటాము. వేడుక సందర్భంగా ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) జీవిత చరిత్ర చదివేవారు ఆయన  జన్మదిన ప్రస్తావన రాగానే అక్కడున్న వారందరూ ఒకేసారి లేచి నించోని ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆత్మ హాజరయ్యింది కాబట్టి ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) గౌరవార్థం మేము లేచి నించున్నాము ' అంటారు. ఇది బుద్ధిహీనతకు పరాకాష్ఠ. ఆయన గౌరవార్థం లేచి నించోవడం గొప్పతనం కానే కాదు. ఎందుకంటే ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) తన కోసం లేచి నించోడాన్ని ఎన్నడూ ఇష్టపడేవారు కాదు. ప్రజలలో అత్యధికంగా దైవప్రవక (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను ప్రేమించినవారు అత్యధికంగా ఆయనకు మర్యాద ఇచ్చిన వారు ఆయన గారి సహచరులు(సహాబాలు)కాని ఆయన(సల్లల్లాహు అలైహి వ సల్లం) జీవితంలో వారు కూడా ఆయన కోసం లేచి నించునేవారు కాదు. ఎందుకంటే ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆ పద్ధతిని ఇష్టపడేవారు కాదు. అటువంటప్పుడు జనం కల్పించుకునే ఊహలకు, భ్రమలకు ఇస్లాంలో స్థానం ఎక్కడుంటుందండీ?!!

ఈ బిద్అత్ మిలాద్ వేడుక - మూడు ఉత్తమ తరాల (ఖైరుల్ ఖురూన్) తర్వాత ఉనికిలోకి వచ్చింది. ఈ వేడుకల్లో ధర్మ విరుద్ధ కార్యాలు జరుగుతుంటాయి. స్త్రీ పురుషుల కలివిడి వాతావరణం, ఇతర పాపాలూ జరుగుతుంటాయి.

(సాలిహుల్ ఉసైమిన్ గారి ఫతావా అర్కానుల్ ఇస్లాం :172-174)